శ్రీ

# :: రామ శతకము ::



గ్రంథకర్త్రి,

కుడితిపూడి వేంకటరత్నమ్మ

పెనుమళ్ళు.

31—1—1941.

## గురుం వందే

సద్గురుఁడగు ధీయుతుఁడగు
సద్గురు గురుజాడ పూర్ణచంద్ర కవీంద్రున్
సద్గోష్ఠీ పరుఁడును భగ
వద్గీతా బోధ నిపుణ వంతుఁ దలంతున్.

## వందే పితరౌ

రామ శతకంబుఁ దగినట్లు వ్రాసినాను
దాని నిప్పుడు ముద్రింపఁ దలఁచి యటులఁ
జేసి నాకీర్తి వ్యాపింపఁ జేయుచున్న
తల్లిదండ్రుల మఱువంగఁ దరమె నాకు.



# రామశతకము

కం॥ శ్రీరఘువంశసుధాకర!
మారాధికసుందరాంగ మాధవ రంగా!
వీరభయంకరనిశిచర
మారణ! గణనీయ శౌర్య మహితా రామా! 1

కం॥ శ్రీరఘురామ జనావన
క్షీరాబ్ధిశయన మురహరి శ్రితజనరక్షా!
వీరాగ్రేసర రామా!
ధీరా శ్రీహరి పవిత్ర రఘుకుల రామా! 2

కం॥ ఇనవంశోత్తమ సద్గుణ
జనహృదయాంతర నివాస సరసిజనేత్రా!
జననాయక శ్రీనాయక
నినుఁ జాలఁగ వేడితి కమనీయక రామా! 3

కం॥ శ్రీరామ నీలవర్ణక!
భూరిదయారససముద్ర పుణ్యచరిత్రా!
మేరుసమానగభీర ము
రారాతివినాశదక్ష రాజిత రామా! 4

కం॥ మునిజన వందిత రామా!
మణిమయ భూష! దశరథ కుమారా! రామా!
రణజయ వీర! సరసిజ న
యన! భవ్యచరిత్ర! సుందరాంగా! రామా! 5

కం॥ రావణ మర్దన! దాశర
థీ! వినుతగుణాభిరామ! దితిజన భీమా!
కావుము సీతానేతా!
రా వరముల కెల్లనిధివి రఘుకుల రామా! 6

కం॥ పన్నగ శయన! రఘుపతీ!
సన్నుతి నినుఁ జేతు, నవనిజాధవ! రామా!
అన్నిట నుంటివి రా! సీ
కన్నన్ వేఱొండు దిక్కు కలదా రామా! 7

కం॥ వారధిబంధన రామా!
శ్రీరఘుకులచక్రవర్తి శ్రితఘనకీర్తీ!
రారా సీతా రమణా!
మారామరజైత్ర ధామ మంగళ రామా! 8

కం॥ నారాయణ! పరమపురుష!
చారుతర విశాలనేత్ర సజ్జనమిత్రా!
ఓ రఘువీరాగ్రేసర!
శ్రీరామ! దయాభిరామ! శ్రీమద్రామా! 9

కం॥ భాను కులేశా! రామా!
దీనదయాపర రఘుపతి! దివిజేశగతీ!

దీనుల బ్రోచెడు దైవమ!
నీ నామమునే, తలంతు నిజముగ రామా! 10

కం॥ కనకాంబరధర! రామా!
ఘనసమసుందరశరీర కల్మషదూరా!
వనజదళాక్షా! రామా!
నను రక్షింపర సతంబు నమ్మితి రామా! 11

కం॥ సీతాపతి నిను గొలుతును
చేతస్సంజాతతాత! శ్రిత సంత్రాతా!
భూతేశ సతత వందిత!
వాతోద్ధుతరుచిర హేమవాసక రామా! 12

కం॥ కారుణ్య ధామ! మౌక్తిక
హార! మునిస్తుత్య! భూప! హరిహర రూపా!
వీరారి దైత్య మర్దన!
నీరధరసమానధామ! నిర్మల రామా! 13

కం॥ హరి నారాయణ! రామా!
సురకాశా! జానకీశ! సుందర కేశా!
ధరణీజానేత! నిఖిల
సురపాలక! దైత్యభీమ! సురుచిర రామా! 14

కం॥ శ్రీరఘువీర! వనజనా
భా! రామ! దశముఖ హరణ! పరమాదరణా!
కారుణ్యాలయ! జగదీ
శా! రామ! తరణికులేశ! సన్నుత రామా! 15

కం॥ హే దాశరథీ! హేం హరి!
హే దశరథ తనయ రామ! హే శ్రీరామా!
హే దశముఖ సంహరణా!
హే దాత! ఘనాభ దేహ! హేం రఘురామా! 16

కం॥ శ్రీరామ! రఘు కులేశా!
ఘోరనిశాచర మదహర! కూంర్మాకారా!
కారుణ్యధామ! రామా!
మారుతసమ! సత్యకామ! మానితరామాం! 17

కం॥ వందే భద్రాద్రీశా!
వందే రఘురామ వీర! వందే శూరా!
వందే సజ్జన పోషా!
వందే మానుష శరీర? వందే రామా! 18

కం॥ వందే నిఖిలాకారా!
వందే సుకుమార! రామ! వందే దేవా!
వందే భూధర ధీరా!
వందే జగదేక భీమ: వందే రామా! 19

కం॥ రావణ భంజన రామా!
రావయ్యా భక్తభృంగ! రమణీయాంగా!
నీవే దైవము నమ్మితి
కావుము కారుణ్య ధామ! ఘనసమ రామా! 20

కం॥ రణజయ వీరా! రామా!
వనికేగిన మానిపతీ! వనజ దళాక్షా!

కనకమణిభూష ! రామా !
ఘనసమ సుందర శరీర కావుము రామా ! 21

కం॥ వందే కల్మష దూరా !
వందే లక్ష్మీవిలాస ! ప్రతిభోద్భాసా !
వందే మంజులభాషా !
వందే రమణీయ వేష ! వందే రామా ! 22

కం॥ వందే పరమపవిత్రా !
వందే సౌందర్య గాత్ర వానర మిత్రా !
వందే సీతానాథా !
వందే కోదండ రామ ! వందే రామా ! 23

కం॥ సుతులకొఱకు దశరథ భూ
పతి పుత్రేష్టిని జరిపెను భాసుర రీతిఁ
మతిమంతుఁడైన శ్రీహరి !
సుతుఁడవుగాఁబుట్టినావు సుందర రామా ! 24

కం॥ మారీచ సుబాహు లనేడు
ఘోరాసురులఁ వధింప కోదండముతో
శ్రీరామ ! నీవుఁ దమ్ముఁడు
చేరితిరి మునీంద్రు వనికి శ్రీరఘురామా ! 25

కం॥ చేరి యచట నిశిచర సం
హారంబు నొనర్చి మునుల కాహ్లాదము గాఁ
శ్రీరామా ! మునిమానస
వారిజమున కెలమిఁ గూర్చవా రఘురామా ! 26

**24 నుండి రామాయణ కథాప్రారంభము—బాలకాండము.**

కం॥ మునులును రామా! నీవును
జనకుని కడ కేఁగుదెంచు సమయములోనన్
మునిపత్నీ ఘోరాఘం
బును పోఁగొట్టియును నుతుల బొందిన రామా! 27

కం॥ మిత్ర కులేశా! విశ్వా
మిత్రుడుఁ రాజులును బొగడ మిథిలాపురిలో
శత్రుభయంకర నీడగు
మిత్రుని విలు విఱచినట్టి మేటివి రామా! 28

కం॥ అప్పుడా దశరథునకు వా
ర్తపంపె జనకుఁడు దశరథరా జదివినియున్
నృపులెల్లరు వెంటను రా
నప్పుడే మిథిలా పురమున కరిగెను రామా! 29

కం॥ జనకుఁడు రామా! సీత
మ్మ నిచ్చె నీకు; భరతునకు మాండవియను నా
మెను; లక్ష్మణు కూర్మిళను; రి
పు నిషూదనుకు శ్రుతకీర్తిఁ బూన్చెను రామా! 30

కం॥ అనుజుఁడుఁ బ్రియయునుఁ దోడై
వెనువెంటను రాగ వనికిఁ బితృవాక్యమునన్
మనమున సంతోషముతోఁ
జనుఁ దెంచిన సుగుణధామ సద్గుణరామా! 31

కం॥ హరి ! నిన్ను శూర్పణఖయును
వరియింపఁగ నీ యనుజులు పట్టియు శిక్షిం
చిరి, కర్ణఘ్రాణములు గో
సిరి, యదియేడ్చుచు స్వజనము జేరెను రామా ! 32

కం॥ ఖరదూషణాదులను హరి !
పరిమార్చితి వీ ; వదివిని భయమాయె నిశా
చరపతికి, హరిణరూపము
ధరించె మారీచుఁడవని తనయూరామా ! 33

కం॥ హరిణమును గోరె సీతయు
నరిగితివి, బిరాన దాని నందఁగ నీవుఁ
దొరకక నదియును వేఁజన
బిరబిర హరిణమును గూలవేసిన రామా ! 34

కం॥ హరిణము మరణించు నపుఁడు
హరి ! ఘోరంబుగనుఁ గూసె నదివిని సీతా
వరసతి నీకే ముప్పని
మరదిని నీకడఁకు బంపె మాధవ రామా ! 35

కం॥ శ్రీరామ ! దశముఖుండును
తేరుపయిఁ సీతనుంచి దివిఁ జనుచుండఁ
వీరుఁడు జటాయు వప్పుఁడు
ఘోరంబుగఁ బోరి నేలఁ గూలెను రామా ! 36

---

31 అయోధ్యాకాండము. 32 అరణ్య కాండము.

కం॥ మునుల యుపదేశ మందియు
మునివృత్తిని బూనుబోయ ముదితను నీవున్
గనుఁగొని మర్యాదల నం
దిన రఘుకుల సోమ రామ తేజోధామా! 37

కం॥ తిని శబరి భక్తిచే ని
చ్చిన యెంగిలి పండ్లు సంతసింపుచు నీవా
మెను సురలోకమునకుఁ బం
పినావు భక్తికిని మెచ్చి ప్రీతిన్ రామా! 38

కం॥ అబలామణియును, మానుల
కు బరిచరణ సేయు బోయకు వనస్థలిలో
శబరికి మోక్ష మొసఁగితివి
శబరియుఁ దపమేమిఁ జేసె జగమున రామా! 39

కం॥ చనుచుం దివికిన్ శబరియు
నినుఁ గొనియాడంగ జూచి నిఖిలామరులున్
మునులును సాశ్చర్యచిత్తవి
ష్ణునిగా భావింపఁ గరుణఁజూచిన రామా! 40

కం॥ ఖగమార్గంబున దివిపై
కెగయుచు యానంబుబోవ నెల్లరుఁ జూడన్
మొగమును బైకెత్తియు బల్
సొగసుగఁ గనుచూడ్కి పర్వఁ జూచిన రామా! 41

కం॥ వనితయు బోయయు నైనం
గని భక్తికి మెచ్చి నీవు కైవల్యంబున్

ఒనరఁగ నిచ్చిన నీ గో
ప్పనుఁ గొనియాడంగ మాకు వశమే రామా! 42

కం॥ ఘోరున నేడ్చుచు నీవును
శ్రీరామా! సీతకొఱకుఁ జెంగటి వనగం
భీరగుహాలు వెదకి వెదకి
వీరజటాయువును గాంచి వింటివి రామా! 43

కం॥ వీరజటాయువు వల్కెను
"శ్రీరామా! రావణుండు సీతను తనదా
తేరున నిడుకొని యేఁగెను
వీరుఁడ! విను" మనుచుఁ బ్రాణవీడెను రామా! 44

కం॥ హరి నీవును లక్ష్మణుఁడును
దిరుఁగుచుఁ గారడవిలోన దీర్ఘ శరీరున్
శిరమును లేని కబంధుని
కరములు ఖండించి జయము గాంచిన రామా! 45

కం॥ సురరూప కబంధువలన
నరసియు వృత్తాంతమెల్ల; నరిగిరి మీర
చ్చెరువుగ భయమునఁ గను వా
నర రాట్సుగ్రీవు దరికి నయముగ రామా! 46

కం॥ వానరపతితో స్నేహముఁ
బూనియు, వాలిన్ జయింప భుజబలవీరుల్
వానర సైన్యంబులు శ్రీ
జానకి, నల్దిశల వెదుక సాగిరి రామా! 47

కం॥ వాయు సుతాది ప్రముఖులు
బోయిరి దక్షిణదిశకును భూజాతను తా
మేయెడఁ గానక యుండిరి
తోయధి దాటెను మరుత్సుతుండును రామా! 48

కం॥ చని లంకకు వేగమునన్
హనుమంతుఁడు భూమిజాత నరసి యశోకం
బను వనమున మఱి నీ వి
చ్చిన యంగుళ్యంబు నిచ్చె సీతకు రామా! 49

కం॥ తనదు శిరోమణి నిచ్చియు
జనకజ తగుగుర్తుఁ దెల్పి సజ్జనుఁడగు శ్రీ
హనుమంతుఁడు సీతకెఱిఁగి
కని రావణు; నీతిఁజెప్పె ఘనముగ రామా! 50

కం॥ ఈ రీతిగ హనుమంతుఁడు
శ్రీరామా! నీదు కథలు సీతకు స్పష్టం
బౌరీతి వచించియు లం
కా రాజ్యముఁ గాల్చి వేగఁ గదలెను రామా! 51

కం॥ హనుమంతుఁడు వేగమున జ
లనిధిని లంఘించి వానరఘనులతోఁ గూ
డి నరహరి! నినుగనియు, లం
కనుగల వార్తలనుఁ దెల్పె ఖ్యాతిగ రామా? 52

కం॥ వారధి బంధించిరి హరి!
మారుతి వానరఘనులును మదగజ తుల్యుల్

చేరియు రక్కసిగమితో
ఘోరముగా యుద్ధమాడ గూడిరి రామా! 53

కం॥ తనవారి చావు విని రా
వణుండు, హరి! కుంభకర్ణుఁ బంపెను యుద్ధం
బున వానిని గూల్చిరి వీ
రును; నిల్చెను శత్రుఁడు తమరు నిలువ రామా! 54

కం॥ రణమందలి సంగతి రా
వణుండు విని యింద్రజిత్తుఁ బంపెను యుద్ధం
బునుఁ జేసె వాఁడతని ల
క్ష్మణుండు, స్వర్గమును జేర్చె ఖలహర రామా! 55

కం॥ తనయుని చావు వినఁగ రా
వణుఁ డాకిఁ దేరు నెక్కి వచ్చెను నితో
డ నిలిచి పోరాడఁగ రణ
మునఁ గూల్చితి పీవు దేవ భువిజా రామా! 56

కం॥ సురలును బుష్పపు వర్షముఁ
గురియించిరి యంత లంకకు విభీషణునిఁ
దొరగాఁ జేసియు సీతా
వరసతిఁ దెప్పించి యిట్లు వలికిన రామా! 57

కం॥ "పౌరుషమునకై రావణు
మారణ మొనరించినాఁడ మానిని! నీవే
తీరున నుండగ నెంచితో
ఆరీతినె యుందుఁ జేకు" మంటివి రామా! 58

53 యుద్ధకాండ ప్రారంభము.

కం॥ జనకజ నప్పుఁడు నీవ
గ్నినిఁ జేరఁ బరీక్షఁ జేసి నిఖిలామరులున్
గొనియాడఁగ సీతనుఁ గొని
కనుపండువుఁ గాగ వినుతిఁ గాంచిన రామా! 59

కం॥ జనకజ పరివారము నీ
యనుజుండును బుష్పకాఖ్య యానముపైనం
జనుఁ దెంచిరి కిష్కింధకు
కనుఁగొని పౌరులును ముదముఁ గాంచిరి రామా! 60

కం॥ కొందఱు వానరులును మఱి
కొందఱు రాత్రించరులును, కూడియురా నీ
వుం దమ్ముఁడు సీతయు నా
నందముతోఁ గూడఁ బయన మయితివి రామా! 61

కం॥ జనులందఱకును ముదమొ
ప్ప నయోధ్యకు మరలినావు వాల్మీకి వసి
ష్ఠనిఖిల మౌనీంద్రులచే
ననువుగఁ బట్టాభిషేక మందిన రామా! 62

కం॥ జనకజతోఁ బ్రియకుశలవ
తనయులతో హితులతోడఁ దమ్ములతోడన్
కనుపండువుగా సౌఖ్యం
బున మించి యయోధ్యనేలు మోహన రామా! 63

---

**63 ఉత్తర కాండము.**

కం॥ కామితఫలదాయక శ్రీ
రామా! సుగుణాభిరామ! దానవభీమా!
హేమాంబర! సన్ముని వి
శ్వామిత్ర నుతాబ్జపాద భాసుర రామా! 64

కం॥ కరివరుఁ గాచిన శ్రీహరి
శరణాగత రక్షరామ! జగదభిరామా!
కరుణా సాగర రామా!
తరణికుల జలనిధి సోమ, దైవము రామా! 65

కం॥ స్వామీ! రఘుకుల వీరా!
శ్యామల సుందర శరీర! సాకేతపురీ
స్వామీ! సీతా సహితా!
నీమహిమల నెన్నఁగఁ దరమే రఘురామా! 66

కం॥ కరుణా రసాంబుధి హరీ!
గరుడగమన గరుణఁజూడు కమలానేత్రా!
ధరణీ జాతా నాథా!
సురుచిర రూప! సురపాల సుందర రామా! 67

కం॥ రామా! దయఁ జూడు హరీ!
రామా! రణరంగభీమ! రమణీయహరీ!
కామిత వరదుఁడ వగు శ్రీ
రామా! నీనామ మేమరకఁ దలఁతు హరీ! 68

కం॥ సీతాసమేత! రామా!
దాతయు తండ్రియును నీవె తల్లియు నీవే!

సీతా రమణా! హే హరి!
ఖ్యాతిగ నిను నమ్మినాను కావుము రామా! 69

కం॥ ఘోర నిశాచర ఘనమద
హరా! మణిహార! పుష్పహార! శరీరా!
పారావార గభీరా!
నారాయణ! పద్మలోచనా శ్రీరామా! 70

కం॥ శరణంబను జనులను బిర
బిర రక్షించెదు నిశిచర భీమా! రామా!
కరుణఁ రక్షించెదు వృష
గిరీశ! మందరగిరిధర కృపఁ గను రామా! 71

కం॥ శ్రీరామ! జగద్రక్షక!
శ్రీరాఘవ! కీర్తిసాంద్ర! సీతారామా!
మారీచ సంహరణ! రా
మా! రాజీవదళనేత్ర మంజుల రామా! 72

కం॥ నీపాద సేవఁ జేయుదుఁ
గాపాడు హరి! కమనీయ కమలాసహితా
ఆపద్బాంధవ! శ్రీరమ
ణా పావనమూర్తి సజ్జనవినుత రామా! 73

కం॥ సనకాది మునీశ్వర విను
త నను కరుణఁ జూడు నారదమునినుత హరీ!
కనకాంబరధర జలజన
యన దీనదయాపర మురహరి రఘురామా! 74

కం॥ ప్రేమగ రక్షించెదు శ్రీ
రామా ! జలదాభ దేహ రఘుకుల రామా !
నామదిలో నిన్నెప్పుడు
నేమరక దలంతు రామ ! హే శ్రీరామా ! 75

కం॥ త్రాతవనుచు నిను నమ్మితి
ఖ్యాతిగ నీశ్వరుని విల్లు ఖండింపగ జ
గ్రాత్రిని నాతినిం జేయఁగ
సీతను గైకొంటచేత శ్రీరఘు రామా ! 76

కం॥ స్మర సమ సుందర రూపా !
దరిఁ జేర్చు పరమపవిత్ర ! దైవలలామా !
కరుణించు ధరణిజాధవ !
మురారి ! కోదండపాణి మోహన రామా ! 77

కం॥ శ్రీరామా ! భూపాలా !
తారకనామ ! మధువాణి ! ధరణీజానీ !
నీరజనాభా ! శ్రీధర !
వీరా ! శ్రీ హరి ! దశముఖ భీమా ! రామా ! 78

కం॥ పాపవిమోచన హరి ! రా
మా పతితపవిత్రరామ మంజులభాషా !
కాపాడవయ్య రామా !
గోపాల మనోజ్ఞధామ ! కోమల రామా ! 79

కం॥ హరి నారాయణ ! రామా !
కరుణఁ బ్రోవుము ముకుంద ! కరుణారసముం

గురియు కనుదోయిఁ గల హరి!
నరహరి! లక్ష్మీనివాస! నమ్మితి రామా! 08

కం॥ కౌసల్యా వరపుత్రక!
భాసుర కమనీయ దేహ వనజాక్షహో!
వ్యాస వసిష్ఠాది వినుత!
నీసరి యెవ్వారుఁ గలరు నిజముగ రామా! 81

కం॥ హే సజ్జనరక్ష హరీ!
హే సాకేత పురవాస హే దరహాసా!
హే సకలగుణ మనోజ్ఞా!
హే సకల జగజ్జన నుత హే శ్రీరామా! 82

కం॥ హే సద్భక్త హృదిస్థిత!
హే సకల మునీంద్ర నిలయ! హే శ్రీనాథా!
హే సోమ శేఖర స్నే
హా సీతానాథ! కామితార్థదరామా! 83

కం॥ హే సురమాన్య చరిత్రా!
హే సుమనోముని కటాక్ష! హృదయ నివాసా!
హే సత్పవిత్ర రామా!
హే సూనృతవాణి రామ! హే రఘురామా! 84

కం॥ హే సత్యవ్రత నిపుణా!
హే సకల జన వినుత హరి! హే గోవిందా!
హే సార్వభౌమ! రామా!
హే సారస నేత్ర భూమిజేశ్వర రామా! 85

కం॥ రామా! నిన్నెద నమ్మితి
నామదిలో నుండి సతము నను దయతోడన్
రామా కావుము మ్రొక్కెద
రామా! చతురాస్యతాత! రఘుకుల రామా! 86

కం॥ సీతారామస్వామీ!
హే తామరసాక్ష! రాక్షసేశ్వర శిక్షా!
గీతా బోధక చతురా!
సీతేశ్వర మదన తాత! సీతారామా! 87

కం॥ దీనజనులకెల్లన్ రా
మా! నీవే దిక్కు రామ! మనమున శ్రీ రా
మా నే మఱువను నిను రా
మా! నాదోషముల నెల్లఁ బాపవె రామా! 88

కం॥ నిరతము నినుఁ దలఁతు హరీ!
యురమున సిరి మెఱయుచున్న ఓరఘువీరా!
వరదా! సత్యచరిత్రా!
హరి! దాసచకోరచంద్ర! హరిహర రామా! 89

కం॥ దరహాస ముఖారామా!
తరణికులాన్వయ పవిత్ర! దశరథ పుత్రా!
కరివరద! సుందరాకా
ర! రామ కరుణా జలనిధి! రఘుకుల రామా! 90

కం॥ ఏ మానులు శ్రీరామా!
నీమాయనుఁ దెలియలేరు నిజమది యెల్లన్

కామాతురులై యెంతో
ధీమంతులు గూడ మాయఁ దెలియరు రామా! 91

కం॥ శ్రీరామా నామది సం
సారంబునఁ జిక్కి నిన్ను స్మరియింపదుగా
ధీరుఁడు నిను నమ్మియు ని
స్సారము సంసారమనుచుఁ జాటును రామా! 92

కం॥ వృద్ధాప్యంబున సోమరిగుదు
శ్రద్ధాశూన్యంబు, దిగులుః జాలఁగ హెచ్చున్
బుద్ధియు స్థిరముగ నిలువదు
శ్రద్ధఁ సిధ్యాన మిప్పుఁడె సల్పుదు రామా! 93

కం॥ గొనములు గనివగు నిన్ననీ
కొని యాడని వాఁడుఁగలఁడె కోటికి నొకఁడున్
మునులును దశరథ రాజుకు
తనయుఁడ వనుకొంద్రు నిను నితాంతము రామా: 94

కం॥ నారదుఁడును ప్రహ్లాదుఁడు
శ్రీరామా నిన్ను నమ్మి చింతించియు సం
సారంబునఁ బడకుండియు
చేరిరి నిను భక్తిఁ గొల్వ శ్రీ రఘురామా! 95

కం॥ భీమాసుర సంహరణా
శ్యామాంబుద నీలగాత్ర సరసిజనేత్రా
స్వామీ పెనుమర్తి నిలయ
శ్రీమత్కోదండరామ! సీతారామా! 96

కం॥ భూమిజావర రమణా!
కోమల రమణీయ గాత్ర గుణనిధిమిత్రా ॥స్వామి॥ 97

కం॥ శ్రీమ దయోధ్యా నిలయా
రామాయణ కావ్యనిలయ ప్రార్థితగేయా ॥స్వామి॥ 98

కం॥ సోమక దానవ సంహార
భూమిన్ రక్షించినట్టి పుణ్యచరిత్రా ॥స్వామి॥ 99

కం॥ కామజనక హరి నీ నా
మామృతమే పుచ్చుకొందు నధికప్రీతిన్ ॥స్వామి॥ 100

కం॥ శ్రీమాధవ యనుచున్ ప్రే
మామోదములన్ దలంతు భవ్యచరిత్రా ॥స్వామి॥ 101॥

కం॥ రామా దశరథ తనయా!
శ్రీమాధవ పక్షివరగ శ్రీహరి రంగా ॥స్వామి॥ 102

కం॥ శ్రీమన్మహాగుణస్తో
మా మణిమయహార రామ మారుతభీమా ॥స్వామి॥ 103

కం॥ మామక పాప విమోచక
ధీమహితా! రుచిర నీల దేహ సుశీలా ॥స్వామి॥ 104

కం॥ మతిమంతుఁడ! నీ దయచే
శతకంబును వ్రాసినాను సత్కీర్తికినై

---

96 వ పద్యమందలి తుది రెండు పాదములు వరుసగా 104 వ పద్యము వరకుఁ జేర్చి చెప్పుకొనవలయును.

మహిమంతులు సుగుణంబులఁ
గుతుకంబునఁ బొందుచుంటఁ గోరుచునుంటిన్ 105

కం॥ పదజాలంబులు మోక్ష
ప్రదములు రామాయణంబు వరుసఁగ వచ్చెన్
సదయులు దీనిని భక్తిన్
చదివిన వ్రాసినను గూడ సంపద కలుగున్ 106

ఆ॥ వె॥ వెలయ కుడితిపూడి వేంకటరత్నమ్మ
యనెడు పేరు గల్గినట్టి నేను
శ్రితజనాశ్రితుఁడగు శ్రీరామచంద్రుని
కరుణఁ గూర్చితి శతకంబు నిటుల 107

కం॥ దేవా! శతకము వ్రాసితి
శ్రీ విక్రమ వత్సరమున (1940) చెల్వుగ నొకమా
సావధి కాలముఁ బట్టెను
శ్రీ విష్ణుఁడ వైన నీకె చెందును కృతిగన్. 108

## గద్యము

శ్రీ మన్న చిన లక్ష్మయ్య గారికి పౌత్రియు వేంకట
రామయ్య గారికి భూషమ్మ గారికిని పుత్రికయు,
కుడితిపూడి వేంకట వీరరాఘవయ్య గారికి
కళత్రము వగు వేంకట రత్నమ్మ
ప్రణీతంబైన శ్రీరామశతకము

సంపూర్ణము.